# ఆడపింకు.

---

పబ్లిషర్సు, రంగా కృష్ణమ్మగారి కుమారుడు

వెంకటరత్నం.

---




బుక్కుసెల్లర్సు అండ్ పబ్లిషర్సు, బెజవాడ.

కాపీరైటు. 1921 వెల 0-1-0.



---

వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

# ప్ర క ట న.

---

మావద్ద అనేకరకముల సంస్కృతాంధ్ర గ్రంథములు, వైద్యగ్రంథములు, నాటకములు, నవలలు దొరకును. భారీగాకొనువారికి మంచికమిషను ఇవ్వబడును.

నాటకములు.

| | |
|---|---|
| సంపూర్ణరామాయణము | 1-4-0 |
| సంపూర్ణోత్తరరామాయణము | 1-0-0 |
| సావిత్రి | 0-12-0 |
| పాదుకాపట్టాభిషేకము | 0-12-0 |
| వేశ్యామధురము 1వ భాగము | 0-6-0 |
| గయోపాఖ్యానము | 0-8-0 |
| ప్రసన్నయాదవము | 0-8-0 |
| పార్వతీపరిణయము | 0-8-0 |
| పద్మినీలోకబాంధవము | 0-12-0 |

# ఆడషోకు

సీ॥ మోమునఁగుంకుమ । మోటాయె మసిబొగ్గు
వలెనుండు చుక్కయే । ప్రబలిపోయె,
యొప్పుగాఁ దలదువ్వి । కొప్పువెట్టుట వెగ
టాయె ముచ్చటముడు । లలరనాయె,
కులధర్మమునుబూని । గోచిపెట్టిన చీర
కట్టుపోయెను నడ్డ । కట్టు కుదిరె,
తిన్నగా పావిట । దిద్దుట వశియించె
పెడపాపిటలె కడు । వృద్ధిఁగాంచె,
తే. గీ॥ పసుపు బరువాయె రోజ్ఫౌను । పౌడరొప్పె,
నున్నిపిండియుఁ జేదయ్యె । సోపువచ్చె,
కాలమంతయు మారెను । కాంతలకును,
క్రొత్తక్రొత్త షోకులు వచ్చెఁ । గొంపదీసె॥

సీ॥ కొప్పుపెట్టుట యందు । గొప్ప విసుగు పుట్టె
ముప్పేట జడపైన । మోజు ప్రబలె,
సంచియల్లుడుపైన । జాల కోరిక పుట్టె
ముచ్చట ముడిపైన । ముచ్చటోదవె,
దవనసంపు జడపైన । దవిలె కోరిక కీలు
జడయన్న గడుసంత । సాంబుగలిగె,
ఈతాకు తాటాకు । ఇంగ్లీషుబాదాము,
రోస్‌జడలన్నను । నింపు పుట్టె,
తే. గీ॥ బిళ్లచుట్టయు మఱి కొండి । వేల యనిన,
బరమ హర్ష మొదవె నింకఁ । దరుణులందు,
నన్ని షోకులు ప్రబలునో । యెంచిచూడ,
గాలచక్రమీలీలను । గ్రాలుచుండె॥

సీ॥ అందెలు కడియాలు । సందుసందులఁ జేరె
బెంగుళూర్పట్టాలు । వృద్ధిగాంచె,
ముడివేయు రవికెలు । కడుమోటు తనమాయె
జాకెట్టుమోజుల । షోకు ప్రబలె,

గాజులు దొడుగుట । కంటికగపడదు,
మంగళూర్ గాజుల । మహిమ హెచ్చె,
పూర్వకాలపు నగల్ । మోటాయె నెంతయు,
వింతవింత నగలు । వెలసె నెన్నొ,
తే. గీ॥ నల్లపూస లనెడి మాట । నాస్తి యయ్యె,
నిన్నఁజూచిన వేషంబు । నేడు లేదు,
ప్రతిదినము క్రొత్తషోకులు । ప్రబలుచుండె,
జెప్పశక్యమె యిక్కాల । స్త్రీల యందు॥

సీ॥ విధవలో కొందరు । వెలదులు క్రాపింగు
వలెఁ దల నుంచుక । వెలుగుచుండ్రి
యుంగరంబులరీతి । నుండుచే షోకని
కొందరుకాంతలు । కోరుచుండ్రి,
చెంపప్రక్కలయందు । నింపుగా గొరిగించు
కొనుట షోకని కొంద । రనుచునుండ్రు,
జడవేసి కుచ్చును । చక్కగా బెట్టుట,
యింపని మరికొంద । రెంచు చుండ్రు,

తే. గీ॥ రవునుముడివేసి చుట్టును । బువ్వులదండ,
దాల్చుటయె పోకటంచును । దలచుచుంద్రు,
కొంద రేమందుదీనికిఁ । గ్రొత్తక్రొత్త
పోకులు ప్రబలె నీకాల । సుదతులందు॥

సీ॥ ధవళవస్త్రము నెప్డు । ధరియింపగా బోదు
ధన్యురా లైనట్టి । ద్రవిడకాంత,
కొప్పునెప్డు ముడువఁ । గోరదు చూడంగ,
గర్నాటదేశపు । కాంతమిన్న,
కచ్చనెప్పుడు గట్ట । గాదలపోయదు,
గుజరాతిదేశపు । సుందరదన,
చీరెను నెప్పుడు । జెలువొప్పగట్టును,
మార్వారుదేశపు । మగువమిన్న,
తే. గీ॥ అన్నిదేశంబు లందున్న । యువతులెల్ల,
తమ మతాచారధర్మముల్ । దలచుచుంద్రు,
కాని యది యేమి చిత్రమో । తొల్మితలమున,
యాంధ్రభామిని యందఱి । ననుకరించు॥

సీ॥ పాటబాడిన మఱి । పాడలేకున్నను,
హార్మోనియం బుండి । యలరవలయు,
చదివిన, లేకున్న, । జదలు పట్టుటకైన,
గ్రంథంబులను గల్గి । గ్రాలవలయు,
యిచ్చిన, లెక్చరు । నీయక యుండిన,
సభలకు, దప్పక । చనఁగ వలయు,
తెలిసినను మఱియు । దెలియకుండిన,
నాటకంబుల నెప్పుడు । గాంచవలయు,
తే. గీ॥ పనియుఁ బాటయు లేకున్నఁ । బదుగు రక్క-
లమ్మలను జేర్చిసంభాష । ణమ్ముసల్పు,
చుండ వలయును లేకున్న । సుదతికాదు,
సుదతులను నేటికాలపు । పోకులివియె॥

సీ॥ కర్ణంబులం దున్న । కమనీయతాటంక,
కాంతులు మిగుల ప్ర । కాశమంద,
నీలంబులను మించి । నెగడు కుంతలములు,
చిన్నారి మోము పై । జిందులాడ,

ఘనరత్న మాణిక్య । కాంచనహారముల్,
గబ్బిగుబ్బల పైన । గంతు లిడఁగ,
ముంజేతి కంకణం । బులధ్వని, పలుమారు,
కణకణ యంచును । గ్రాలుచుండ,
తే. గీ॥ చీరచెఱగు భూమిపయిన । జిందుద్రొక్క,
వేగమూపుల మూచుచు । సారసాక్షి,
యొకతె, నాటకాలయమున । కొప్పమీర,
నేగుచున్నది విటచిత్త । మూగులాడ.

సీ॥ కడియాలచప్పుడు । గానరాకుండగా,
పైభాగమున లాగి । పట్టియుంచి,
విరుదుల నంటెడి । కురులను ముడివేసి,
వరబెంగుళూర్ రుమాల్ । పాగ జుట్టి,
కరకంకణధ్వని । గాని పించు నటుంచు,
గట్టిగా గుడ్డచేఁ । గట్టు కట్టి,
పురుషుఁడే యనుభ్రాంతి । నొందము చందంబున,
బాగైన తెల్లధో । వతిని దాల్చి,

తే. గీ॥ మిలిటరీకేను నొక్కటి / లలితగతిని,
హస్తమందున బూని, ప్ర / శస్తమైన,
సిజరు సిగరెట్టు గాల్చుచు / శీఘ్రగతిని,
బురుషు డనునట్లు జనుచుండె / బాలతియొకతె॥

సీ॥ చూడ ననవద్యంబు / చూపట్టు మోమున,
పవుడరు నొక్కింత / పామిపామి,
కురులు లేకున్నను / గురులున్నవని తెల్ప,
సవరంబుతో నెంతొ / సాగదీసి,
రజకునిఁ బ్రార్థించి / రహిదెచ్చుకొని నట్టి,
ఘనమైన చీరె నొ / క్కటి ధరించి,
వింతవింతల గొల్పు / విక్టోరియాడిపో,
గిల్టువస్తువులను / గీలుకొల్పి,
తే. గీ॥ యోర్మినైనను వంచింతు / నెంచి; బాట,
సారుల గొలరుఁ జూచుచు / చాన యొకతె,
రైళు లన్నియు వచ్చెడి / వేళయందు,
జేర బెజవాడ రైలు వే / స్టేషనునకు॥

సీ॥ సరస మైనట్టి భా । వణముల చేతను,
సభ్యు లానందాబ్ధి । జలకమాడ,
శ్రావ్యమైనట్టి మేల్ । సంగీత మాలించి,
తద్దయు చూపరుల్ । తలలుద్రిప్ప,
ముంజేత నున్నట్టి । ముద్దైనకంకణం,
బులధ్వను, లలతాళ । ముగతి చెలంగ,
భావంబు లన్నియుఁ । బ్రకటించుటకు గాను,
హస్తముల్ రెండును । నాడుచుండ,
తే. గీ॥ చిత్తమందు వెఱపు సింత । చేర్చుకుండ,
పురుషుడా యను భ్రాంతియుఁ । బొల్పెసంగ,
చెప్పుచున్నది హరికధ । నొప్పుగాను,
కీరవాణియా నెల్లూరు । కృష్ణవేణి॥

సీ॥ ముంజేత, తోడాలు । మురుగులు గొల్సులు,
నతి కాంతు లీనుచు । నమరియుండ,
మెడలోన నున్నట్టి । మేలిమి బంగారు,
నాను పేరులు రంగు । లీనుచుండ,

రవలచే నొప్పారు । రమ్యమై తనరారు,
ముక్కుపుడక లెంతో । మురిసియాడ,
నీలంబులకు నిగ్గు । నెగడ జేసెడి మేటి,
కురుల ముడి ముదము । గొలుపుచుండ,
తే. గీ॥ ముత్తయిదొ లేకముండయో । బోల్చలేని
భంగి, బండినెక్కగ ప్లాటు । ఫారమందు,
ట్రంకు నొక్కటి హస్త । మందునమర,
వేచియున్నది వేడ్కతో । వెలదియొక తె॥

సీ॥ మగవారి రీతినే । మగువలందున స్వతం,
త్రత యుండ వలెనంచు । దలచు వారు,
పురుషుల భంగినే । పొలుపార నుద్యోగ,
ముల జేయవలె నంచు । దలచు వారు,
పురుషులతో గూడి । పరమ ముదమున బం,
తులనాడ వలెనంచుఁ । దలచు వారు,
భర్తలతో గూడి । బైసికిల్ పైరుకు,
దరలంగ వలెనంచుఁ । దలచు వారు,

తే. గీ॥ సభలయందున గొప్ప లె । క్చరులనీయ,
వలయు నంచును నిరతంబు । దలచువారు,
కలిగి, యొప్పుచుండిరి నేటి । కాలమందు,
స్త్రీలు, దీనికి మూలంబు । గాలమహిమ॥

---

